# ఖండకావ్యద్వయము

కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని విరచితము.

తెలుగు తాత్పర్యములు:

గుంటూరు లక్ష్మీకాంతముచే

సమకూర్చబడెను.

వికారి

1959

వెల : 25 న. పై.

# ఖండకావ్యద్వయము

కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని విరచితము.

తెలుగు తాత్పర్యములు:

గుంటూరు లక్ష్మీకాంతముచే

సమకూర్చబడెను.



వికారి

1959

వెల: 25 న.పై.

# మ న వి



ఈ చిన్నిపొత్తములో శ్రీ వాసిష్ఠగణపతిమునులు తమ చిన్ననాటను రచించిన రెండు ఖండకావ్యము లున్నవి. మొదటిది పదేండ్ల వయస్సున నొకగంటలో రచింపబడి యంతటి లేతవయస్సునకే వశమైన కవిత్వప్రజ్ఞను ప్రదర్శించుచున్నది. వారి వయస్సుతోపాటు పెరుగుచు, బాల్యము దాటకపూర్వమే శైలియందు, త్వరితగతియందు, రసభంగిమ మందు సాధించిన అభివృద్ధిని రెండవదైన 'సుకన్యాదస్రసంవాదము' నిరూపించుచున్నది. ఇది 62 శ్లోకములతో నిబద్ధమైనను నొక్కగంట లోనే ముగింపబడినట్లు గద్య తెల్పుచున్నది.

సుబోధమై, నీతిదాయకమై యున్న యీ రెండుకావ్యములు పిన్నలకే గాక పెద్దలకును ప్రబోధమును గలిగించును. కనుక దీని నెల్లరు చదివి ధన్యత జెందుదురుగాక.

—గుంటూరు లక్ష్మీకాంతము

# పాండవ ధార్తరాష్ట్రసంభవము

మంగళశ్లోకము.

జగద్గురూ నహం వందే బ్రహ్మవిష్ణుమహేశ్వరాన్।
వాణీలక్ష్మీశివానాథాన్ సృష్టిస్థిత్యంతకారిణః॥

తా॥ సరస్వతీ లక్ష్మీ పార్వతులకు (వరుసగా) భర్తలైనట్టి, సృష్టిస్థితిలయకారులైనట్టి, జగద్గురువులైనట్టి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గురించి (అనగా సతీసమేతులైన ముగ్గురు దైవములకు) నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ యశోభిర్దిగిభశ్రేణీ దంతకాంతిమలిమ్లుచైః।
మండితః పాండురిత్యాసీ ద్భారతో భారతే నృపః॥ 1

తా॥ దిగ్గజశ్రేణియొక్క దంతకాంతి (ధవళతేజము) నపహరించు కీర్తులచే నలంకృతుడైన పాండు వను భరతవంశపురాజొకడు భారతదేశమందుండెను. (పాండువర్ణ మనగా తెల్లనివర్ణము కనుక ధవళకీర్తులు కలవాడగుటచే పాండురాజైనట్లు కవి చమత్కరించెను. దిగ్గజములనగా నొక్కొక్కదిక్కున నొక్కొక్కటి చొప్పున అష్టదిక్కులందు భూమిని భరించుటకు తోడ్పడుగజములు. వానిపేర్లు ఐరావత, పుండరీక, వామన, కుముద, అంజన, పుష్పదంత, సార్వభౌమ, సుప్రతీకములు.)

తస్య సర్వాగమజ్ఞస్య ప్రజ్ఞయైవ విలోచనీ।
ధృతరాష్ట్ర ఇతి భ్రాతా జ్యేష్ఠః శ్రేష్ఠమతేరభూత్॥ 2

తా॥ సర్వశాస్త్రములనెఱిగి, శ్రేష్ఠమైన బుద్ధిగలిగిన అతనికి

ప్రజ్ఞాచక్షువుమాత్రమే కలిగిన (అనగా నంధుడైన) ధృతరాష్ట్రుడను పేరుగల జ్యేష్ఠసోదరుడుండెను.

పూర్వజే నామునా పాండోః పరిణీతా గుణోన్నతా।
సుబలస్య సుతారాజ్ఞో గాంధారీనామ సుందరీ॥ 3

తా॥ పాండువునకగ్రజుడైన అతనిచే సుబలుడనురాజు యొక్క కొమార్తెయైనట్టి, యున్నత గుణములు గలిగినట్టి గాంధారి యను పేరుగల సుందరి పరిణయము జేసికొనబడెను.

సా రామా యౌవనారంభే కించి త్పరిచితానపి।
జనుషాన్ధం పతిం ప్రాప్య విసస్మారేవ విభ్రమాన్॥ 4

తా॥ ఆ లలనామణి పుట్టుగ్రుడ్డియైన మగనిని బొంది, యౌవన ప్రారంభమందే పరిచితములైన స్వల్పవిలాసములనుగూడ మరచిపోయి నట్లుండజొచ్చెను.

యాదవీ యామినీనాథ వదనా కాచిదంగనా।
కాలే తస్మిన్పృథానామ పృథివీమండలే బభౌ॥ 5

తా॥ ఆకాలమున యాదవకులమందు బుట్టి చంద్రునిబోలు ముఖముగలిగిన నొకయంగన పృథయను నామముచే పృథ్వీమండలమందు బ్రకాశించుచుండెను.

స్వసఖ్యే కుంతిభోజాయ శూరశ్శూరవరః పితా।
ప్రదదౌ దుహితృత్వేన ప్రీతిం మూర్తిమతీమివ॥ 6

తా॥ శూరులలో శ్రేష్ఠుడు, నామెకు తండ్రియునైన శూరుడు తనకు స్నేహితుడైన కుంతిభోజునకు మూర్తీభవించిన ప్రీతివలె నామెను కొమార్తెగా నొసగెను.

అముష్యైకిల సంతుష్టో దుర్వాసాః పరిచర్యయా।
విద్యాముపదిదేశైకాం దేవా నయన దూతికామ్॥ 7

తా॥ (ఒకనాడక్కడ) దూర్వాసమహర్షి యామె పరిచర్యలచే సంతుష్టుడై దేవతలను రప్పింపగల దూతికవంటి యొకవిద్య నామె కుప దేశించెను.

న సా మిత్రం వశీచక్రే కేవలం విద్యయా తయా।
కేతకీ కలికా కాంతైః కోమలై రంగకైరపి॥ 8

తా॥ (ఆవిద్యనుబొంది) ఆమె సూర్యు నొకనాడు కేవల మంత్రి బలమువల్లనే కాక మొగలిమొగ్గలవలె కోమలములైయున్న తన యం గములచేగూడ వశముగావించుకొనెను.

సుతం సహజవర్మాణం లబ్ధ్వారాజీవ బంధుతః।
కళంక శంకితా సద్యః సా ముమోచ సహాశ్రుభిః॥ 9

తా॥ ఆసూర్యునివలన సహజకవచము (వర్మ) కల సుతు నామె కని, కళంకమునకు జడిసి, వెంటనే యాపుత్రుని కన్నీటితో సహా విడచి పెట్టెను.

కుంతీ వానస్త్రికా ముక్తం రాధాధాత్రీ భృతం తతః।
సూర్యసూను ప్రసూనం తద్వీరశ్రీ శ్శిరసా దధౌ॥ 10

తా॥ కుంతియను లతచే విడువబడి, రాధయను భూమిచే (పెంపుడు తల్లిచే) భరింపబడిన సూర్యపుత్రుడను పుష్పమును వీరలక్ష్మి తనశిరస్సున బెట్టుకొనెను. (లతచే విడువబడిన మంచిపుష్పమును భూమి (ధాత్రి) యెంతో ప్రీతితో గైకొనునట్లు కుంతిచే విడువబడిన సూనుని పెంచగా నాతడు వీరుడయ్యెనని భావము.)

కుంత్యాః కౌర్యాజితరతే స్త్విషాం పత్యురనుగ్రహాత్।
నైవాభ్రశ్యత కన్యాత్వం నచా క్షీయత యౌవనమ్॥ 11

తా॥ సేవాకార్యతత్పరతయం (రతి) దజితమైన (సాటిలేని) కుంతి యొక్క కన్యాత్వము కాంతులకు ప్రభువైన సూర్యుని యనుగ్రహము వలన భ్రష్టముకాలేదు సరికదా యామె యౌవనమైనను క్షీణించలేదు.

దత్తా సా కుంతిభోజేన పాండునా జగృహే కరే।
దత్తః కుసుమబాణేన తయా పాండుస్తు చేతసి॥ 12

తా॥ కుంతిభోజునిచే నీయబడిన ఆమె పాండురాజుచే కరగ్రహణము చేసికొనబడగా మన్మథునిచే నీయబడిన పాండురాజు నాకుంతి తన మనస్సున గ్రహించెను.

అన్తః ప్రవిశ్యభూజానే ర్బాలసారంగలోచనా।
చరణాలక్తకేనేవ రక్తం చేతశ్చకార సా॥ 13

తా॥ లేడిపిల్లనేత్రములవంటి కన్నులుగల ఆమె భూనాథుని మనస్సున ప్రవేశించి పాదములకు పూయబడు పారాణిచేతవలె అతని చిత్తమును రక్తమంత మొనర్చెను.

కన్యాచాన్యా మహీశేన మాద్రీ భద్రేభగామినీ।
పరిణీతా పరిణత ప్రాలేయకిరణాననా॥ 14

తా॥ ఆరాజుచే పూర్ణచంద్రునివంటి ముఖముగలది, భద్రగజము వంటి నడకగలది, మాద్రియను పేరుగలది యైన నింకొక కన్యయు పెండ్లాడబడెను. (పరిణత=పండిన, పూర్ణమైన; ప్రాలేయకిరణః=హిమకిరణుడు, లేదా చంద్రుడు.)

కతి చిద్వత్సరా న్కాంతే తేద్వే విశ్వంభరామపి।
దాక్షిణ్యేన స దీర్ఘాక్షో బుభుజే మనుజేశ్వరః॥ 15

తా॥ విశాలనేత్రములుగల ఆ మనుజేశ్వరుడు కొన్నిసంవత్స రము లా యిరువురుకాంతలను, భూమిని (రాజ్యమును) గూడ (సమాన మైన) అనురాగముతో ననుభవించెను.

జహార మృగయా దూరం మహీదారం తమేకదా।
సకృన్నిషేవితమపి వ్యసనం హి పరాభవేత్॥ 16

తా॥ ఒకనాడారాజును బహుదూరముగా వేటయను వ్యసనము గైకొనిపోయెను. వ్యసన మొక్కసారి సేవింపబడినను పరాభవమును బొం దించునట్టిదే కదా! (మహీదారం=భూమిని భార్యగాగలవాడు, రాజు. మృగయా=వేట.)

క్రీడన్తం మృగసుందర్యా స మునిం మృగభూమికమ్
పాండుర్జఘాన బాణేన స పాండుం ఘోరయా గిరా॥ 17

తా॥ మగలేడివేషమును ధరించి యాడులేడితో క్రీడించుచున్న ఒకముని నాపాండురాజు బాణముతో గొట్టగా ఘోరమైన శాపవాక్కుచే పాండురాజు నాముని కొట్టెను. (మృగభూమికమ్=లేడివేషమును ధరించిన; మృగసుందరి=ఆడులేడి.)

అనుభూయ భవాన్కాంతా మంతం దిష్టస్యయాస్యతి
చంచరీక ఇవాఘ్రాయ చాంపేయ కలికా మితి॥ 18

తా॥ "సంపెంగమొగ్గ నాఘ్రాణము జేయు తుమ్మెదవలె నీవు స్త్రీననుభవించుటవలన మృత్యువును బడయుదువు" అనునది యాశాప వాక్కు. (దిష్టస్య అంతం=మృత్యువును.)

అథా సారం భవం బుద్ధ్వా బంధున్యస్త ధరాభరః।
సతీభ్యాం సహపత్నీభ్యాం పాండుః ప్రవ్రజితో వనమ్॥ 19

తా॥ పిమ్మట పాండురాజు సంసారము సారములేనిదని గ్రహించి, రాజ్యభారమును బంధువులపై నునిచి, యోగ్యురాండ్రైన తనభార్యలతో గూడ వనమునకు వెళ్ళిపోయెను.

శ్రుత్వా తత్ర మహర్షిభ్యో నాపుత్రో గతిమానితి।
రాజా క్షేత్రజసంతత్యై కుంత్యా సాక మమంత్రయత్॥ 20

తా॥ పుత్రులులేనివాడు సద్గతిబొందడని యావనమందు మహర్షులవలన వినినవాడై, క్షేత్రజ సంతానముకొఱకు పాండురాజు కుంతితో మంతనము సల్పెను.

అథాళి కుంతలా కుంతీ బహుపుత్రాభిలాషిణః।
కౌమారోపార్జితాం విద్యాం భేజే పత్యుర్నిదేశతః॥ 21

తా॥ అంతట, తుమ్మెదలవంటి ముంగురులుగల కుంతీదేవి బహుపుత్రాభిలాషియైన తనపతియొక్క యాజ్ఞచొప్పున బాల్యమం దార్జింపబడిన విద్యను స్మరించెను (క్షేత్రజ సంతానముకొఱకు).

తస్యాం యుధిష్ఠిరో నామ ధర్మాద్విద్యా బలాగతాత్।
క్షేమాయ క్షితిలోకస్య పుణ్యశ్లోకః సుతోఽజని॥ 22

తా॥ మంత్రబలమువలన వచ్చిన యమధర్మరాజువల్ల భూలోక క్షేమముకొఱకు పుణ్యశ్లోకుడైన పుత్రుడొకడు యుధిష్ఠిరు డనుపేరుగలవాడై ఆమెయందు (మొదట) పుట్టెను.

గజాయుతబలం పశ్చా దవాప గజగామినీ।
పృథునేత్రం పృథాపుత్రం భీమం నామ సమీరణాత్॥ 23

తా॥ పిమ్మట గజగామినియైన పృథ (అనగా కుంతి) పదివేల (అయుత) యేనుగులబలము, విశాలనేత్రములు గలిగిన భీము డనుపేరు గల పుత్రుని వాయుదేవునివలన బొందెను.

అర్జునం తనయం ప్రాప వజ్రపాణేరియం తతః।
ప్రసాదం హరితాం పంక్తిః ప్రమోదం మరుతాం తతిః॥ 24

తా॥ తరువాత నీకుంతి దేవేంద్రునివలన అర్జును డనుపుత్రుని బడసెను. (అతని పుట్టుకవలన) దిక్కులన్నియు నిర్మలములై వికసించెను, దేవతాసమూహమంతయు ప్రమోదమును బొందెను.

అపి సర్వగుణోపేతై ర్నా తృప్య త్త్రిభిరాత్మజైః।
దిదృక్షుః పుత్రపూర్ణాంకాం మాద్రీమపి మహీపతిః॥ 25

తా॥ సర్వగుణోపేతులైనట్టి ముగ్గురు పుత్రులు కలవాడైనను రాజు తృప్తి జెందక, మాద్రిని గూడ పుత్రులతో నంకపూరితురాలగుట చూడ గోరెను.

మద్రేశవంశనందిన్యై మేదినీ భర్తురాజ్ఞయా।
వితతార పృథాదేవీ విద్యాం దేవవశంకరీమ్॥ 26

తా॥ భూభర్తయైన పాండుని యాజ్ఞచొప్పున పృథాదేవి తన దేవవశంకరీవిద్యను మాద్రికొఱ కిచ్చెను.

దస్రాభ్యాం దయమానాభ్యాం ధరణీశవధూరసౌ।
నకులం సహదేవంచ సుతావాప సతీమణిః॥ 27

తా॥ రాజుభార్యయైన యీసతీమణి (మాద్రి) దయగల అశ్వినీ దేవతలవలన నకులుని సహదేవుని కవలుగా బడసెను. (సుతౌ + అవాప = సుతావాప.)

ధృతరాష్ట్రవధూర్గర్భం కుంత్యాః ప్రాగేవ గర్భిణీ।
చిరం సంతతి మప్రాప్య జఘాన కిల ముష్టినా॥ 28

తా॥ కుంతికంటెను పూర్వమే గర్భవతియైన ధృతరాష్ట్రుని భార్య చిరకాలము సంతానప్రాప్తి బడయక గర్భమును ముష్టిచే (పిడికిలితో) గొట్టుకొనెనట.

ఫలితే శతధా గర్భే పతితే ధరణీతలే।
ఆసన్వ్యాస ప్రసాదేన శకలాః శతమర్భకాః॥ 29

తా॥ (అందువలన) గర్భ (పిండ)ము నూఱుముక్కలుగా ధరణీతలమందుబడి, వ్యాసమహర్షి యనుగ్రహమువలన నాముక్కలు నూఱుగురు బాలకులుగా అయ్యెను.

సర్వక్షత్రక్షయేహేతు ర్యేషాం దుర్యోధనో ముఖమ్।
దుఃశాసనో వికర్ణశ్చ యేష్వన్యౌ మూర్ఖపండితౌ॥ 30

తా॥ వారిలో మొదట రూపొందిన దుర్యోధనుడు సర్వక్షత్రియ నాశనహేతువయ్యెను. మిగిలినవారిలో దుశ్శాసన వికర్ణు లిరువురును మూర్ఖపండితు లయిరి. (దుశ్శాసనుడు మూర్ఖుడు, వికర్ణుడు పండితుడు అని భావము.)

సర్వక్షత్రక్షయేహేతో ర్ధార్తరాష్ట్రస్య జన్మని।
నవాత్యయా కేవలయా జగద్భీత్యాచ కంపితమ్॥ 31

తా॥ సర్వక్షత్రక్షయహేతుభూతుడైన దుర్యోధనుని జన్మసమయమందు జగత్తు సుడిగాలివల్లనే కాక భీతిచే గూడ కంపించెను.

ఖండోఽపర శ్చంద్రఖండ నిర్విశేషాళిక స్థలీ।
అభూత్కుల కులజ్యోత్స్నా దుస్సలానామ కన్యకా॥ 32

తా॥ వేఱొకఖండము చంద్రఖండమును బోలిన నొసలుగల కన్యకయై, దుస్సలయనుపేరు గలిగి, కులమునకు వెన్నెల యయ్యెను. (అనగా సంతోషమును గూర్చిన దయ్యెను.)

తే బాలకా వవృధిరే నగరే వనేచ।
మూర్ధాభిషిక్త మునిపుంగవలాల్యమానాః।
కౌతూహలేనచ మునేః కలహప్రియస్య।
లోకస్య లోచనవత స్సమముత్సవేన॥ 33

తా॥ రాజుచే లాలింపబడుచు కౌరవబాలకులు నగరమందును, మునిపుంగవులచే లాలింపబడుచు పాండవబాలకులు వనమందును వృద్ధి జెందజొచ్చిరి. కలహప్రియుడైన నారదమునియొక్క కౌతూహలముతో పాటు కౌరవులును, దృష్టిగల లోకముయొక్క యుత్సవముతోపాటు పాండవులును వృద్ధినొందిరి. (అనగా మొదటివారు కలహప్రియులుగాను, రెండవవారు లోకకల్యాణప్రియులుగాను బెరిగిరని భావము.)

గద్య:— ఇతి శ్రీ వాసిష్ఠస్య నరసింహసూనోర్గణపతేః కృతిః పాండవధార్తరాష్ట్రసంభవోనామ ఘంటా త్రయస్త్రింశ ద్బంధ స్సమాప్తః.

(ఇట్లు శ్రీ వాసిష్ఠసగోత్ర నరసింహశాస్త్రి పుత్రుడైన గణపతిచే ముప్పదిమూడుశ్లోకములుగా నిబద్ధమైన పాండవధార్తరాష్ట్రసంభవ మను పేరుగల ఖండకావ్యము, గంటలో సమాప్తమయ్యెను.)



# సుకన్యాదస్ర సంవాదము

శ్లో॥ మహర్షి శ్చ్యవనో నామ వనే వనరుహాస్యయా।
యువత్యా భార్యయా వృద్ధ స్సహావాత్సీత్సుకన్యయా॥ 1

తా॥ చ్యవనుడనుపేరుగల మహర్షి వృద్ధుడై పద్మమువంటి ముఖముగలిగిన సుకన్యయను యౌవనవంతురాలైన భార్యతోగూడి వనమందు వసించు చుండెను.

తయోర్నివసతో స్తత్ర గతః కాలః కియానపి।
శ్రేష్ఠ మాచరతో ర్ధర్మం పూర్వైస్సద్భిరనుష్ఠితమ్॥ 2

తా॥ పూర్వులైన సత్పురుషులనుష్ఠించు శ్రేష్ఠధర్మాచరణముచే వారా వనమందు తమ జీవితకాలమును వెళ్లబుచ్చుచుండిరి.

ఏకదా మునివర్యస్య స్నాతుం యాతా కుటుంబినీ।
సరః కల్హారరాజీవ శోభి సారస నాదితమ్॥ 3

తా॥ ఒకనాడా మునివరుని భార్య స్నానార్థమై చెంగల్వలతోడను పద్మములతోడను సారసపక్షుల కలకలారావములతోడను శోభించు నొకసరస్సునకు వెళ్లెను.

తత్రాభిషిక్తాం సంఛన్నాం తనునార్ద్రేణ వాససా।
వార్షికాంభోద సంకాశ సతోయ కబరీభరామ్॥ 4

తా॥ ఆ సరస్సునందు స్నానమాడి, తడిసిన సన్ననిబట్టచే గప్పబడిన మేను, వర్షాకాలమేఘమువలె నీటిబిందువులను రాల్చు కొప్పు,

విమలాదర్శవదనాం విశాలాధీరలోచనామ్।
రాజత్కపోలఫలకాం సుదతీం పల్లవాధరామ్॥ 5

తా। నిర్మలమైన అద్దమునంటి ముఖము, విశాలములై చంచలములగు నేత్రములు, మెఱయుచున్న చెక్కిళ్లు, చక్కని పలువరస, లేజిగుళ్లను బోలు పెదవులు,

ఉత్తుంగకర్కశాన్యోన్య సంసక్త పృథుల స్తనీమ్।
తనుమధ్యాం ఘనశ్రోణీం సర్వావయవ సుందరీమ్॥ 6

తా॥ ఎత్తై, కఠినములై, దగ్గరగా బిగిసియున్న పెద్ద స్తనములు, సన్నని నడుము, ఘనమైన పిఱుదులు గలిగి సర్వావయవములచేతను సుందరియై యున్న ఆమెను,

వ్యలోకే తామాస్వినేయౌ భిషజౌ నాకవాసినామ్।
విస్మయం పరమం ప్రాప్తౌ సమీపంచోప జగ్మతుః॥ 7

తా॥ స్వర్లోకవాసులకు (అనగా దేవతలకు) వైద్యులైన అశ్వినులిరువురు (వీరు జంటగా నుందురు) చూచి, మిగుల విస్మయము జెందినవారై, యామెదగ్గరకు వచ్చిరి.

తౌ సమీపముపాగత్య సుకన్యాయా స్సుయోషితః।
ఊచతు ర్వచనం శ్లక్ష్ణ మశ్వినౌ రూపమోహితౌ॥ 8

తా॥ ఉత్తమస్త్రీయైన సుకన్య నాయశ్వినీదేవత లట్లు సమీపించి, యామె రూపమునకు మోహితులై, మృదువచనములతో నిట్లనిరి.

భార్యా కస్యాసి రంభోరు కస్యత్వం తన్వి కన్యకా।
కుతో వనే చరస్యస్మి న్వనజాతాయతేక్షణే॥ 9

తా॥ ఓ పద్మనేత్రి! నీ వెవ్వరి భార్యవు? ఎవరి కొమార్తెవు? ఈ వనమందేల సంచరించు చుంటివి? (అని ప్రశ్నించిరి.)

తావువాచ సురశ్రేష్ఠౌ సుకన్యా హ్రీమతీ వచః।
గృహిణీ చ్యవనస్యాహం శర్యాతే ర్భూపతే స్సుతా॥ 10

తా॥ (వారిని జూచినంతనే) లజ్జావతియైన సుకన్య సురశ్రేష్ఠులైన ఆ యశ్వినులకు "నేను చ్యవనుని భార్యను, శర్యాతియను రాజునకు గొమార్తె" నని ప్రత్యుత్తరము బల్కెను.

అథో చతుః ప్రహస్యేద మశ్వినౌ రాజనందినీమ్।
వృద్ధస్య గృహిణీ కిం త్వం చ్యవనస్య ద్విజన్మనః॥ 11

తా॥ ఆపల్కులు వినినపిమ్మట అశ్వినులు నవ్వుకొని యారాజ పుత్రిని గుఱించి యిట్లనిరి. "నీవు వృద్ధబ్రాహ్మణుడైన చ్యవనుని భార్యవా?

సురస్త్రీ దుర్లభం రూపం క్వతే కమలలోచనే।
వృద్ధశాఖామృగాకార శ్చ్యవనః క్వ ధరామరః॥ 12

తా॥ ఓ కమలలోచనా! సురస్త్రీలకుగూడ దుర్లభమగు నీరూప మెక్కడ? పండుకోతివంటి యా చ్యవనబ్రాహ్మణుని రూపమెక్కడ?

క్వేదంతే యౌవనం తన్వి జృంభమాణ ఘన స్తనమ్।
పలిత శ్మశ్రు వృద్ధత్వం జీర్ణాంగం క్వ ద్విజన్మనః॥ 13

తా॥ ఓ తన్వీ! దినదినప్రవర్ధమానమగు ఘనస్తనములు కల నీ యౌవనమెక్కడ? జీర్ణాంగములు గలిగి, పండిన గడ్డము గల ఆబ్రాహ్మణుని వృద్ధత్వమెక్కడ?

నత్వం యోగ్యా మనుష్యస్య దేవేంద్ర దయితోపమే।
విశేషా జీర్ణవయస శ్చ్యవనస్య సుమధ్యమే॥ 14

తా॥ ఓ సన్నని నడుము గలదానా ? దేవేంద్రుని భార్యను బోలియున్న నీవు మనుజులకు తగవు, విశేషించి జీర్ణవయస్కుడైన చ్యవనునకు (బొత్తిగా) తగవు.

త్వయా విభూషిత మిదం వనం సర్వమభూషయా।
కయాచిన్నోపమేయా త్వమన్యయా తన్వి యోషయా॥ 15

తా॥ భూషణములు లేనిదానవైనను నీచేత నీ వనమంతయు నలంకృతమయ్యెను. ఓ చిన్నదానా ! నీ కుపమానముగా చెప్పదగు స్త్రీ యింకొకతె లేకున్నది.

గర్హణీ యస్సశర్యాతి ర్యస్త్వాం సర్వాంగసుందరీమ్।
రూపహీనాయ వృద్ధాయ వితతార విలాసిని॥ 16

తా॥ ఓ విలాసినీ ! సర్వాంగ సుందరివైన నిన్నా రూపహీనుడైన వృద్ధున కేతండ్రి యిచ్చెనో శర్యాతియను నాతడు నిందింపదగినవాడు.

త్వాం విలోకయతోః కాపి కరుణా సముదేతినౌ।
వృద్ధస్య యువతీం భార్యాముద్బుద్ధాంభోజలోచనామ్॥ 17

తా॥ వికసించిన పద్మములవంటి నేత్రములుగల యువతి వయ్యు వృద్ధునకు భార్యవైన నిన్ను విలోకించుచున్న మా కనిర్వాచ్యమైన కరుణ కలుగుచున్నది.

విసృజ్య చ్యవనం వృద్ధం గతాధ్వానమమన్మథమ్।
భజైకమావయోర్భీరు యస్తే చిత్తాయ రోచతే॥ 18

తా॥ ఓ పిరికిదానా ! కామో్ద్రేకములేనివాడు, అడవులందు సంచరించువాడు, ముదుసలియునైన చ్యవనుని విసర్జించి, మా యుభయులలో నీ చిత్తమునం దెవడు రుచించునో వానినొకనిని నీవు స్వీకరింపుము.

ఆవాం ప్రసిద్ధౌ నాసత్యౌ భిషజౌ నాకవాసినామ్।
దీర్ఘాక్షి గుప్తామావాభ్యామన్యస్త్వాం నాలమీక్షితుమ్॥ 19

తా॥ ఓ దీర్ఘాక్షీ ! మేమిరువురము నాకవాసులకు వైద్యులమని ప్రసిద్ధి బడసిన అశ్వినులము. (కనుక) మాచే సంరక్షింపబడు నిన్ను మఱియొకడు కన్నెత్తిచూడజాలడు సుమా.

నతే భయం పృథుశ్రోణి చ్యవనాదన్యతోపివా।
ఏకం లోకోత్తరాకారే భజమానం భజావయోః॥ 20

తా॥ ఘనమైన పిఱుదులు, లోకోత్తరమైన ఆకృతి కల ఓ చిన్నదానా ! నీకు చ్యవనునివలన గాని యింకొకనివలన గాని భయముండదు. మాయుభయులలో నీకు ప్రీతిగలవానిని పొందుము.

యది చ్యవనమేవ త్వమకామ మనువర్తసే।
ధిక్తే సుందరతామేతాం వనజ్యోత్స్నా మివాఫలామ్॥ 21

తా॥ అట్లుచేయక నీవొకవేళ అకాముడైన చ్యవనునే యనువర్తించితివేని నీ సౌందర్య మడవిగాచిన వెన్నెలవలె వ్యర్థమగును.

ఏతావదుక్త్వా నాసత్యౌ విజనే చారుదర్శనౌ।
ఉత్తరం సంప్రతీక్షేతాం సుకన్యాయాస్సుయోషితః॥ 22

తా॥ చూడసొగసైన యశ్వినులంతవఱకే యా విజనస్థలమందు బల్కి, యువతియైన సుకన్యవలన వచ్చు ప్రత్యుత్తరమునకై నిరీక్షించిరి.

ఏవముక్త్వా సురూపాభ్యాం సురాభ్యామపి సువ్రతా।
హృదయేనాపి సన్మార్గం సుకన్యా నాత్యలంఘత॥ 23

తా॥ సురూపులు, సురలుకూడ అయిన ఆ యశ్వినులచే నిట్లనుగ బడినను పతివ్రతయైన సుకన్య తన సన్మార్గమునుండి హృదయముచేనైనను చలించలేదు.

లజ్జయావనతం వక్త్రం కించిదున్నమ్య సా సతీ।
ఈషద్రక్తాన్తనయనా భర్తృదూషణజ క్రుధా॥ 24

తా॥ (పైగా) లజ్జచే దించుకొనియున్న ముఖము నాసతీమణి యించుక పైకెత్తి, భర్తృదూషణవలన జనించిన క్రోధముచే కొంచె మెఱ్ఱబడిన నేత్రము కలదియయ్యెను.

స్వసేవ భూయస్స్నేహేన వక్తుకామా హితం తయోః।
ధైర్యేణ రోషం సంస్తభ్య శర్యాతి దుహితాబ్రవీత్॥ 25

తా॥ (కాని) ధైర్యముచే తన రోషము నణగద్రొక్కుకొని శర్యాతి పుత్రికయైన యామె వారికి తోబుట్టువువలె నధికస్నేహముచే హితవును బల్కగోరి యిట్లు నుడివెను.

అహం న శోచనీయాస్మి భవద్భ్యాం సురపుంగవౌ।
దత్తా మే దేవదేవేన భక్తిర్వృద్ధేఽపి భర్తరి॥ 26

తా॥ ఓ సురపుంగవులారా! మీరు నన్నుగూర్చి విచారింపనక్కఱలేదు. (ఎందువల్లననగా) నాకా ముసలిభర్తయందే దేవతలకు గూడ దేవుడైన పరమేశ్వరునిచే భక్తి యొసగబడెను.

యాభక్తిసహితా నారీ కాన్తే గతవయస్యపి।
న శోచనీయా సా ప్రాజ్ఞైర్యత్స్వయం సానశోచతి॥ 27

తా॥ వయస్సుగడచిన భర్తయందు దేభార్యామణి భక్తితోఁగూడి యుండునో, ఆమె తనకు తాను విచారించుటలేదు కనుక పండితులామెను గుఱించి దుఃఖింప నక్కఱలేదు.

యా భక్తిరహితా నారీ కాన్తే నవవయస్యపి।
శోచనీయైవ సా ప్రాజ్ఞైర్యత్స్వయం సైవ శోచతి॥ 28

తా॥ నవవయస్కుఁడైన భర్తయైనను వానియందు భక్తిలేని భార్య యెవతెయో, ఆమె తనకుతానే విచారించును కనుక పండితు లామెను గుఱించి సంతోషించరు.

పత్యౌ భక్తిః ప్రమోదస్య కారణం కులయోషితాం।
సా స్త్రీణాం పరమోధర్మ ఇతి శాస్త్రవిదో విదుః॥ 29

తా॥ కులాంగనలకు పతిభక్తియే సంతోషకారణము. స్త్రీల కట్టిభక్తి పరమధర్మమని శాస్త్రకోవిదులు తెలిసికొనిరి.

రూపేణ భర్తరి ప్రీతిం యా కరోతి కులాంగనా।
సా రూపేణాధికం పత్యుర్దృష్ట్వా వ్యభిచరేన్న కిమ్॥ 30

తా॥ ఏ కులాంగన తనభర్తయందు రూపమునెంచి ప్రీతి గలిగి యుండునో, ఆమె తనభర్తకంటె నధికరూపవంతుని జూచి (చిత్తమున) వ్యభిచరించకుండునా ?

వయసా భర్తరి ప్రీతిం యా కరోతి కులాంగనా।
సా నవం వయసా పత్యుర్దృష్ట్వా వ్యభిచరేన్న కిమ్॥ 31

తా॥ ఏ కులాంగన తనభర్తయందు వయస్సునెంచి ప్రీతి గలిగి యుండునో, ఆమె తన భర్తకంటె నధికయౌవనవంతుని జూచి (చిత్తమున) వ్యభిచరించకుండునా ?

విద్యయా భర్తరి ప్రీతిం యా కరోతి కులాంగనా।
సా విద్యయాధికం పత్యుర్దృష్ట్వా వ్యభిచరేన్న కిమ్॥ 32

తా॥ ఏ కులాంగన తన భర్తయందు విద్యనెంచి ప్రీతిగలిగి యుండునో, ఆమె తన భర్తకంటె నధిక విద్యావంతుని జూచి (చిత్తమున) వ్యభిచరించకుండునా ?

సంపదా భర్తరి ప్రీతిం యా కరోతి కులాంగనా।
సా సంపదాధికం పత్యుర్దృష్ట్వా వ్యభిచరేన్న కిమ్॥ 33

తా॥ ఏ కులాంగన తన భర్తయందు సంపదను బట్టి ప్రీతి గలదగునో, ఆమె తనభర్తకంటె నధిక సంపన్నుని జూచి (చిత్తమున) వ్యభిచరించకుండునా ?

యా కరోతి వధూః ప్రీతిం పతిత్వాదేవ భర్తరి।
పతిత్వ భావతోఽన్యస్య సా నస్యా ద్వ్యభిచారిణీ॥ 34

తా॥ ఏ వధువు తన పతియందు పతిభావముచేతనే ప్రీతిగొని యుండునో, ఆ వధు వన్యునియెడ పతిభావము లేకుండుటచే వ్యభిచారిణి కానేరదు.

యా పతిం ప్రమదా హిత్వా పుమాంస మితరం భజేత్।
నకేవలం తయా భర్తా పుమా నన్యశ్చ వంచితః॥ 35

తా॥ ఏ నారీమణి తన పతిని విడిచి (హిత్వా) యింకొక పురుషుని భజించునో, ఆమెచే పతిమాత్రమే కాక యీ యితరుడును వంచితు డగును.

శబ్దాదయస్సురశ్రేష్ఠా విషయా లోకవంచకాః।
జయాయ నియమస్తేషు పరాభూత్యై విపర్యయః॥ 36

తా॥ ఓ సురశ్రేష్ఠులారా ! శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడి పంచవిషయములు లోకవంచకములు. (ఇంద్రియ) నియమము కలవారు వానిని జయింతురు, లేనివారు పరాభవము పొందుదురు.

విషయేష్వేవ బాహ్యేషు భావబంధం కరోతి యః।
విషయాణాం స బాహుళ్యా న్న క్వచి ల్లభతే స్థితిమ్॥ 37

తా॥ ఎవడు బాహ్యవిషయములందే తన మనస్సు నెల్లప్పుడు నుంచునో, వాడు విషయబాహుళ్యమువలన దేనియందును స్థితిని (నిలకడను) కొంచెమైనను పొందజాలడు.

తాదృశస్య మనోభావ శ్చాపలేన ప్రతిక్షణమ్।
స్థితి మప్రాప్య కుత్రాపి నిత్యదుఃఖాయ కల్పతే॥ 38

తా॥ అట్టివానియొక్క, మనోభావ మనుక్షణము చపలీకృతమై, దేనియందును స్థిరస్థితిని బొందక, నిత్యదుఃఖమును కల్పించును.

అన్యస్య తరుణీం కాంక్షేద్యః పుమా నల్పదర్శనః।
తేనాత్మనో వధూ స్త్యక్తా లభ్యతేవేతరా నవా॥ 39

తా॥ అల్పదృష్టిగల యేపురుషు డింకొకనిభార్యను కాంక్షించునో, వానిచే నామె పొందబడినను మానినను నిజభార్యమాత్రము విడువబడిన దగును.

అసతీమితరాం లబ్ధ్వా పండితః కోఽనుమోదతామ్।
సా పూర్వమివ భర్తారం కిం నాత్మానంచ ముంచతి॥ 40

తా॥ అట్లు పొందబడిన అన్యుని సతిని గురించి యే పండితుడు మెచ్చుకొనును? అట్టిదగునామె తన పూర్వభర్తను విడిచినట్లే వీనిని విడువదా?

యస్యాః ప్రమాణం నోసత్యం నార్యా రాగాంధచేతసః।
అసతీ మల్పవిజ్ఞానః కామ్యేన శ్రద్దధాతితామ్॥ 41

తా॥ రాగముచే నంధమనస్కురాలైన యే నారీమణికి సత్యము (సతీత్వధర్మము) ప్రమాణముకాదో, అట్టి యసతియైన (సతీత్వమును చెడగొట్టుకొనిన) ఆమెను కామ్యముచే నల్పబుద్ధిగలవాడే నమ్మును.

స తయా పురుషః కామీ మంద శ్చంచలయా స్త్రియా।
భ్రంశితః ప్రథమం ధర్మా త్స్వయం చాన్తే విసృజ్యతే॥ 42

తా॥ కామించిన మందబుద్ధి గల ఆ పురుషుడు తొలుత స్వాయముగా ధర్మమునుండి భ్రష్టుడై, తుద కా చంచలయైన స్త్రీచేతను విసర్జింపబడును.

సత్యం సురవరౌ రక్ష్యం స్త్రియావా పురుషేణవా।
తద్రక్షితం రక్షతి స్వం నైవ రక్షత్యరక్షితమ్॥ 43

తా॥ ఓ సురవరులారా! స్త్రీచేగాని పురుషునిచేగాని సత్యము రక్షింపబడవలెను. అది రక్షింపబడినయెడల నది మనలను రక్షించును. రక్షింపబడని సత్యము రక్షించజాలదు.

సత్యానపాయినో రాగా యా సా ముత్తమయోషితామ్।
తాసా ముత్తమ విద్వాంసో విదుర్నామాపి పావనమ్॥ 44

తా॥ ఏ ఉత్తమస్త్రీలయొక్క అనురాగములు యదార్థములై (సత్యమునుండి తొలంగనివై) యుండునో, అట్టిస్త్రీలయొక్క పేళ్లనుసైత ముత్తమ విద్వాంసులు పావనముగా నెంచుచున్నారు.

ఉత్సృష్టా జనకే నాహం చ్యవనాయ మహాత్మనే।
ప్రభుణా తం తు సంబంధం నానృతం కర్తుముత్సహే॥ 45

తా॥ ప్రభువైన తండ్రిచే నేను మహాత్ముడైన చ్యవనునికొఱకీయబడితిని. అట్టి సంబంధము నే ననృతముగావింప నొల్లను.

భవన్తౌ శాస్త్ర నిష్ణాతౌ దేవయోనీ విశేషతః।
నింద్యం నైతాదృశం భావం మనసా కర్తు మర్హతః॥ 46

తా॥ మీ రుభయులు శాస్త్రవేత్తలు, పైగా దేవయోనిసంభూతులు. నింద్యమైన యిట్టి భావమును మనస్సుచేతనైనను తలపెట్టుట మీకు తగదు.

యచ్చోక్తం ముని ముద్దిశ్య మాననీయం తపోనిధిమ్।
తత్ర వాం చాతురీ దేవౌ తుదతీవ మనో మమ॥ 47

తా॥ ఓదేవతలారా! మాననీయుడును, తపోనిధియు నగు ముని నుద్దేశించి మీచే పలుకబడిన వాక్యేదియో, తత్సంబంధమైన మీ చాతుర్యము నామనస్సును బాధించుచున్నది.

యేన దగ్ధః పితుర్వైరీ జాతమాత్రేణ దానవః।
న బిభేతు జనః కోవా తస్మాచ్చండదృశో మునేః॥ 48

తా॥ పుట్టినతోడనే యెవడు తనతండ్రియొక్క శత్రువైన రాక్షసుని దగ్ధునిగావించెనో (పులోము డను నీరాక్షసుడు వరాహరూపుడై

నిండుగర్భవతియైయున్న భృగుని భార్యయగు పులోమ నెత్తుకొనిపోవు చుండ చ్యవనుడామెగర్భమునుండి జారిపడి రాక్షసునిపై తనదృష్టిప్రసరింప జేసినంతనే వాడు దగ్ధుడైనట్లు కథకలదు), అట్టి తీక్ష్ణమైన దృష్టికల ఆ మునివల్ల భీతిఁజెందని జనుడెవడు ?

దృష్ట ప్రభావస్సమయా బ్రహ్మర్షి రమిత ద్యుతిః।
జ్వలల్లోచన భేదిన్యా పూర్వం పాణినిపీడనాత్॥ 49

తా॥ అమిత తేజస్సుతో గూడిన ఆ బ్రహ్మర్షిప్రభావము పాణి గ్రహణమునకు పూర్వమే అగ్నినేత్రమును భేదించిన నాచే చూడ బడెను. (ఆ ప్రభావమును దానిచే వికసించిన నా జ్ఞానచక్షువు చూడ గల్గెనని భావము)

నావమాన్య స్సతాం మాన్యో భవద్భ్యాం చ్యవనోమునిః।
నిర్దహే దపి లోకాంస్త్రీ న్యది క్రుద్ధస్స భార్గవః॥ 50

తా॥ సత్పురుషులకు పూజనీయుడైన చ్యవన మునీశ్వరుడు మీయుభయులచే నవమానింపబడకుండుగాక. ఆభార్గవుడు క్రుద్ధుడైనచో లోకములు మూడింటినిగూడ దహింపజేయును.

సనాతనస్య ధర్మస్య పాలయన్తౌ యువాం గతిమ్।
అంగీకృత్య స్వసారం మాం స్వం మార్గం గన్తుమర్హథః॥ 51

సనాతనధర్మముయొక్క గతిని పాలించు మీరు నన్ను తోబుట్టువుగా (స్వసారం) నంగీకరించి, మీత్రోవను బొండు.

ఏవం చతురభాషిణ్యా ప్రత్యాఖ్యాతౌ సుకన్యయా।
యుక్తం వచనమబ్రూతా మాశ్వినేయౌ సురోత్తమౌ॥ 52

తా॥ ఇట్లు నేర్పుగా భాషించిన సుకన్యచే నిరాకరింపఁబడిన అశ్వినులనెడి సురోత్తములు యుక్తమైన వచనమును బల్కిరి.

ప్రధానం యది కల్యాణి ధర్మమేవాభిమన్యసే।
కామాదర్థాచ్చ సుశ్రోణి ప్రీతౌ స్వ స్త్వయి భామిని॥ 53

తా॥ ఓ గొప్పపిఱుదులుగల భామినీ, కల్యాణీ! (ధర్మార్థకామములు మూఁడింటిలో) నీవు అర్థకామములకంటె ధర్మమునే ప్రధానముగా నెంచితివి. ఆకారణముచే నీయందు మేము సంప్రీతులమైతిమి.

భర్తార మభిరూపం తే కర్తా స్వో నవయౌవనమ్।
సత్యేన సమయేన శ్వః కేనాపి యది వాంఛసి॥ 54

తా॥ నీ కిష్టమయినచో నొకయొడంబడికప్రకారము నీ భర్తను రూపవంతునిగాను, నవయౌవనునిగాను రేపు మేము చేసెదము.

సచాయం సమయ స్తన్వి యువానం సుందరం మునిమ్।
ఆవాంచ సమభిప్రేక్ష్య త్రిష్వేకం వృణు వల్లభమ్॥ 55

తా॥ ఓ తన్వీ! మునిని యౌవనవంతునిగాను సుందరునిగాను చేసిన మేమును అట్లగుదుము. నీవుబాగుగా జూచి మాముగ్గురిలో నొకనిని వల్లభునిగా వరింపుము. ఇదియే యొడంబడిక. (సమయః)

అశ్వినో స్తమభిప్రాయం సుకన్యా వరవర్ణినీ।
నాథాయ కథయామాస చ్యవనాయ మహాత్మనే॥ 56

తా॥ అశ్వినులయొక్క ఆ యభిప్రాయమును ఉత్తమురాలయిన సుకన్య తన భర్తయగు చ్యవనమహాత్మునితో చెప్పెను.

అంగీ చకార తత్సర్వం చ్యవనో దీర్ఘదర్శనః।
దస్రౌ శ్వో భూయ ఆగత్య యథోక్తం కర్తుముద్యతౌ॥ 57

తా॥ దీర్ఘదృష్టికల చ్యవను డాయభిప్రాయమునంతను అంగీకరించెను. మఱునాడు (శ్వో) దస్రులు మరల వచ్చి, వారు పల్కిన చొప్పున చేయ నుద్యుక్తులైరి.

నాసత్యయో ర్గిరా మౌనీ వివేశ చ్యవన స్సరః।
తౌచ ప్రవిష్టౌ తదను స్వర్లోకభిషజా వుభౌ॥ 58

తా॥ అశ్వినులు చెప్పిన మాటచొప్పున చ్యవనుడు సరస్సున బ్రవేశించెను, అతని వెంబడిని స్వర్లోకవైద్యులైన వారుభయులును గూడ ప్రవేశించిరి.

తతస్తస్మాత్సరో మధ్యా న్నిర్గతాః పురుషాస్త్రయః।
తుల్యప్రమాణ రూపాస్తే సుకన్యాయాః పురోఽభవన్॥ 59

తా॥ అప్పుడా సరస్సు మధ్యనుండి తుల్యప్రమాణరూపులైన ముగ్గురు పురుషులు బయటికి వచ్చి, సుకన్యయెదుట నిలచిరి.

తానాలోక్య విశాలాక్షీ శర్యాతి కులనందినీ।
చిరాయ చింతయామాస మమ భర్తా క ఏష్వితి॥ 60

తా॥ విశాలనేత్రములు గలిగిన శర్యాతిపుత్రిక వారిని జూచి, తనభర్త యెవడైయుండునని చాలసేపాలోచించెను.

తత శ్శ్రద్ధేన భావేన చిన్తయిత్వా నృపాత్మజా।
త్రిష్వేకం పురుషం వవ్రే చ్యవనో మునిరేవ యః॥ 61

తా॥ అప్పుడు పరిశుద్ధభావముచే రాజుకొమార్తె యోచించి, యా ముగ్గురిలో నేపురుషుడు చ్యవనమునియో ఆతనినే వరించెను.

చ్యవన స్స్వాం ప్రియాం భూయః ప్రాప్య హర్షం పరం యయౌ,
శీలేన చాస్యా స్సంహృష్టౌ దేవవైద్యౌ బభూవతుః॥ 62

తా॥ చ్యవనుడు తన ప్రియురాలిని తిరుగ బొందినవాడై పరమ సంతోషమును బొందెను. దేవవైద్యులు కూడ నీమెయొక్క శీలముచే సంతోషము బొందినవారయిరి.

---

ఇట్లు వాసిష్ఠసగోత్ర నరసింహశాస్త్రికి పుత్రుడైన గణపతి యొక్క 'సుకన్యాదప్రసంవాద' మను పేరు గలిగి 62 శ్లోకములచే నొక గంటలో రచింపబడిన ఖండకావ్యబంధము ముగిసెను.

# శ్రీ తారకరామ నామ స్తుతి



నిర్గుణ నిష్కళ నిత్య నిరంజన నిర్గత మత్సర గమ్య దయాళో।
దశరథనందన, దశరథనందన, దశరథనందన, దాశరథే॥ 1

సంసారేస్మి న్నిర్గతసారే పాహి విపారే దశవదనారే। దశరథ॥ 2

సర్వసమత్వం సర్వహితత్వం సత్సంగత్వం దేహి విభో మే। దశ॥ 3

జననక్లేశం మరణక్లేశం నాశయగమనా గమనక్లేశం। దశ॥ 4

కో మే పుత్రః కో మే జాయా మాయాసేయం పాహి విభోమాం। దశ॥ 5

సనకసనందన సంస్తుతచరితం జానీతే త్వాం కో గుణరహితం। దశ॥ 6

నాస్తి వపుస్తే నాస్తి తవాఖ్యా నాస్తిచ కర్మ స్వస్తిదవిష్ణో। దశ॥ 7

మాయాకల్పిత మిద మఖిలంతే రూపం కర్మచ నామచ వివిధం। దశ॥ 8

నామతు రామే త్యమల మిదంతే తారకమృషయః పరిభాషంతే। దశ॥ 9

చతురాస్యస్త్వం చక్రధర స్త్వం పరమేశ స్త్వం పరమాత్మా త్వం। దశ॥ 10

తత్త్వసమూహా దుపరి లసంతం పురుషం సాంఖ్యాః ప్రవదంతి త్వాం।దశ॥ 11

దశశతపత్రే దశముఖశత్రో యోగవిద స్త్వా మాలోకంతే। దశ॥ 12

జైమినిముఖ్యాః కర్మఫలం త్వాం దేవవదంతో నందంతిస్మ। దశ॥ 13

వేదాంతే యే నిష్ఠిత మతయ స్తే ప్రాహు స్త్వా మేక మభేదం। దశ। 14

గణపతికవినా రచితం స్తోత్రం లలితం ప్రీత్యై భవతో భూయాత్।దశ॥ 15



# అకారమాలా శ్రీ విష్ణు స్తుతి

అవ్యయ మాధవ అంతవివర్జిత అబ్ధిసుతాప్రియ కాంతహరే।
కృష్ణ జనార్దన కృష్ణ జనార్దన కృష్ణ జనార్దన కృష్ణ హరే॥
ఆ శరనాశన ఆదివివర్జిత ఆత్మజ్ఞానద నాథహరే। కృష్ణ॥
ఇంద్రముఖామర బృందసమర్చిత పాదసరోరుహ యుగ్మహరే। కృష్ణ॥
ఈశ్వరసన్నుత ఈతిభయాపహ రాక్షసనాశన దక్షహరే। కృష్ణ॥
ఉన్నతమానస ఉచ్చపదప్రద ఉజ్వలవిగ్రహ దేవహరే। కృష్ణ॥
ఊర్జోనాశిత శాత్రవసంచయ జలధరఘర్జిత కంఠహరే। కృష్ణ॥
ఋషిజనసన్నుత దివ్యకథామృత భవ్యగుణోజ్వల చిత్తహరే। కృష్ణ॥
ౠకారప్రియ ఋక్షగణేశ్వర వందితపాద పయోజహరే। కృష్ణ॥
ఌతకసమర్చిత కాంక్షితదాయక కుక్షిగతాఖిలలోక హరే। కృష్ణ॥
ౡవల్లోకా చార సమీరిత రూపవివర్జిత నిత్యహరే। కృష్ణ॥
ఏకమనోముని మానసగోచర గోకులపాలక వేషహరే। కృష్ణ॥
ఐరావతకర సన్నిభ దోర్బల నిర్జితదానవసైన్య హరే। కృష్ణ॥
ఓంకారాంబుజ వనకలహంసక కలిమలనాశన నామహరే। కృష్ణ॥
ఔన్నత్యాశ్రయ సంశ్రితపాలక పాకనిబర్హణ సహజ హరే। కృష్ణ॥
అంగదసేవిత భంగవివర్జిత సంగవివర్జిత సేవ్య హరే। కృష్ణ॥
అస్తగిరిస్థిత భాస్కరలోహిత చరణసరోజిత లాఢ్యహరే। కృష్ణ॥
కమలావల్లభ కమలవిలోచన కమలవిభాహర పాదహరే। కృష్ణ॥
ఖరముఖదానవ సైనికఖండన ఖేచరకీర్తిత కీర్తిహరే। కృష్ణ॥
గణపతిసేవిత గుణగణసాగర వరగతినిర్జిత నాగహరే। కృష్ణ॥
ఘటికాపర్వత వాసి నృకేసరి వేషవినాశిత దోషహరే। కృష్ణ॥

ః ప్రత్యేకం నయథావాక్యే నాథ తథాతే చిత్తేక్రోధః। కృష్ణ॥
పలాభాసుర మేఘనిభప్రభ కమలాభాసుర వక్షహరే। కృష్ణ॥
్లయుతదూర చలాచలలోచన గోపవధూ హృదయేశహరే। కృష్ణ॥
నిర్గుగతీవల్లభ రూపపరాత్పర సర్వజగజ్జన పూజ్యహరే। కృష్ణ॥
ఘంకారధ్వని కారి మధువ్రత మంజులకేశ కలాపహరే। కృష్ణ॥
సంనాక్షరసంయుత 'జా'ధాత్వర్థే పరిస్థితనైష్ఠిక గమ్యహరే। కృష్ణ॥
సఝంకార ధ్వని కారి ధనుర్ధర శాతశరాహత దైత్యహరే। కృష్ణ॥
జనర'మితి మనుంవా 'స'మితి మనుంవా జపతాంసిద్ధిద నాథహరే। కృష్ణ॥
క్షోమరుకరేశ్వర పూజితనిర్జిత రావణదానవ రామహరే। కృష్ణ॥
సనకాద్యా ప్రియభయవారణ వినయవివర్జిత దూరహరే। కృష్ణ॥
నాట ధాత్వర్థే పండితమండిత సకలావయవో ద్భాసిహరే। కృష్ణ॥
వతత్త్వమసీతి వ్యాహృతివాచ్య ప్రాచ్యధినాయక పూజ్యహరే। కృష్ణ॥
నూతా్కారానిల వేగనభోగత సప్తసముద్ర వరాహ హరే। కృష్ణ॥
దయితాలింగిత వక్షోభాసుర భూసురపూజిత పాదహరే। కృష్ణ॥
ధరణీతనయా జీవితనాయక వాలినిబర్హణ రామహరే। కృష్ణ॥
నారాయణ మాధవ కేశవవామన గోపాలక గోవిందహరే। కృష్ణ॥
పరమేశ్వర పక్షి కులేశ్వర వాహనమోహన రూపహరే। కృష్ణ॥
ఫాలవిలోచన పంకజసంభవ కీర్తితసద్గుణ జాలహరే। కృష్ణ॥
బలరిపుపూజిత బలజితదానవ బలదేవానుజ బాలహరే। కృష్ణ॥
భవభయనాశన భక్తజనప్రియ భూభరనాశనకారి హరే। కృష్ణ॥
మాయామోహిత సకలజగజ్జన మారీచాసుర మథనహరే। కృష్ణ॥
యమునాతటినీ వరతటవిహరణ యక్షగణేశ్వర వంద్యహరే। కృష్ణ॥
రామరమేశ్వర రావణమర్దన రతిలలనాథవ తాతహరే। కృష్ణ॥
లక్ష్మణసేవిత మంగళలక్షణ లక్షితశిక్షిత దుష్టహరే। కృష్ణ॥

వాలివినాశన వారిధిబంధన వనచరసేవిత పాదహరే। కృష్ణ॥
శంకరకీర్తిత నిజనామామృత శత్రునిబర్హణ బాణహరే। కృష్ణ॥
షడ్గుణమండిత షడ్దోషాపహ దోషాచరకుల కాలహరే। కృష్ణ॥
సదయసదాశివ పూజితపాదుక హృదయవిరాజిత దయితహరే। కృష్ణ॥
హస్తచతుష్టయ భాసురనందక శంఖగదా రథ చరణహరే। కృష్ణ॥
'ఘుబు, ఘుబు'నిస్వన మజ్జితమంధర పర్వతధారణ కూర్మహరే। కృష్ణ॥
క్షయితనిశాట క్షాంతిగుణాఢ్య క్షేత్రజ్ఞాత్మక దేవహరే। కృష్ణ॥

గణపతి పండిత రచితం స్తోత్రం, కృష్ణస్యేదం జయతు ధరణ్యాం।
కృష్ణ జనార్దన కృష్ణ జనార్దన, కృష్ణ జనార్దన కృష్ణ హరే॥